# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సం పుటము 4 రాజమహేంద్రవరము 1-12-1980 సంచిక 3


—* ఈ సంచికలో *—



16—12—80 సంచికలో తెలుగు ఎలెజీ స్వరూపము, కోడి కూతలు కాలప్రమాణా లవుతాయా ?, ఆధునిక నవలికకు శ్రీ కుటుంబరావు చేకూర్చిన సంపద మొదలగునవి ఉంటాయి

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు. 12—00. విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

ంపుటము 4 — రాజమహేంద్రవరము 1-12-1980 — సంచిక 3


## "మాకు బ్రసన్నుడయ్యెడిన్"


- శ్రీ కె కిశోరుబాబు, ఎం. ఏ (తెలుగు)
- శ్రీ కె అశోకుబాబు, బి. ఎస్‌సి. (వ్యవసాయం)


ఉదంకుడు నాగలోకమునకరిగి జలధి ఝుకిఁ బాయకశయ్యయైన యయ్యహిప దుష్కృతాంతకుఁడనంతుడు, అద్రినందనేశ్వరునకు భూషణంబయిన వాసుకి, విపుల ప్రతాపసంభావితశక్తి శౌర్యులైన ఐరావత కోటి ఘోరఫణిరాజులు, బలపరాక్రమ దక్షు డీక్షణశ్రోతవిభుండయిన తక్షకుడు, మాకు ప్రసన్నులవుదురుగాక అని స్తుతించు సందర్భమున నన్నయ్య 'మాకు ప్రసన్నుడయ్యెడున్' అను ఏకమకుటముగల నాలుగు పద్యములను రచించినాడు అందు రెండు చంపకములు, రెండుఉత్పలములు (భారతము ఆది1 ఆ 105-108) తెలుగు సాహిత్యమున వెలసిన మకుటాత్మక స్తుతిశతకములకు దీప స్తంభములవలె నిలచి మార్గము చూపినది నన్నయ్యగారు రచించిన ఈ పద్య చతుష్టయమే అని విమర్శకులం పేర్కొనుచుందురు నన్నయగారు ఉపయోగించిన మాకు ప్రసన్ను డయ్యెడిన్ అను రుచిరార్థ వాక్యమునకు మనసుపడి తరువాతి కవులందరు తమతమ కావ్యములలో స్తుతిఘట్టముల సందర్భమున వానినే యథాతథముగా వాడుకున్నారు

అంచలు కూసిన వెనుక కొంచలు కూసిన భంగి ఆద్యులకావ్యశయ్యల కలరి రచనకు బూనుకొన్న ఎఱ్ఱాప్రెగడ తన హరివంశమునందు రాఘవకథానిధి కీర్తి ధురీణుడగు వాల్మీకిని గొలుచు సందర్భమున

చతురోద్యత్కృతి వాతపోతక మహా
  సాంయాత్రికుండై తగన్
జతురామ్నాయ పయోధులన్ గలగి భా
  స్వద్రత్నముల్ రామ స
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగమున్
  భూషించె నేధన్యు డా
ప్రతిముఖ్యుండు ప్రసన్నుడయ్యెడుఁ గృపన్
  వాల్మీకి మాకెప్పుడున్ (హరి 1-3)

అని అబ్జాసన కల్పుడగు నన్నయ్యగారి వాక్యమునే ఆగమవాక్యమువలె గ్రహించి పుట్టంబుట్టిన తపసిని ప్రార్థించినాడు

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యముల సృష్టికర్త సహజపండితుడగు బమ్మెరపోతనార్యుడు తన వీరభద్రవిజయ కృత్యాదిని ఉన్నత గుణ ధుర్యుఁడగు నన్నపార్యుని వాక్కునే ఊతగా గైకొని మధుర మూత్మ్మ ఫలరసము క్రియ గరళము మ్రింగి జగములకు శుభములను చేకూర్చిన సర్వమంగళ విభుని ప్రస్తుతించుచూ

సిరియును వాణి గౌరి యని
  చెన్నగు కన్యకు మేను, వాక్కు పె
న్నురమును నుంకవిచ్చి ముద
  మొప్ప వరించి జగంబులన్నియున్
దిరముల సేయ బ్రోవఁ దుది
  దీర్పగ ద్రష్ట యగేక్షణుండునై
హరివిధి శంభుమూర్తియగు
  నాద్యుఁడు మాకు బ్రసన్నుడయ్యెడిన్.

శ్రీలలితంపు భూతియును
  శేషవిభూషణమున్, శిరంబుపై
వేలుపు టేఱు పాపటను
  వెన్నెల పాపడు, మేను గొండరా
చూలియు గేల ముమ్మొనల
  శూలము నీల గళంబు గల్గునా
వేలుపు శ్రీమహోనగము
  వేలుపు మాకు బ్రసన్నుడయ్యెడిన్

అను వృత్తయుగ్మము రచించినాడు ఇందు సిరియును వాణి గౌరి యను చంపకము నన్నయగారి శ్రీవాణీ గిరిజాశ్చిరాయ అను ఆదిపర్వారంభ సంస్కృత ప్రార్థనా శ్లోకమునకు మేలి తెలిగింపుగానున్నది శ్రీలలితంపు భూతియును' అను ఉత్పలము పాలకుర్కి సోమన వృషాధిప శతకమునందలి పలుపాడతోలు సీరయును పాపసరుల్ అను జాను తెనుగు పద్యము

నందలి మించులను పుణికిపుచ్చుకొన్నట్లుగా వెలుగొందుచున్నది

భోజరాజీయమువంటి చక్కటి స్వతంత్ర కథాకావ్యమును రచించిన అనంతామాత్యుడును నన్నయగారి వాగ్విభూతిని గైకొనియే తన కావ్యాధినాథుడగు అహోబల నృసింహుని -

శ్రీరమణీ పయోధర ప
  రిస్ఫుట కుంకుమ ఫాలభాగ క
స్తూరిక లిప్త కేళిగతి
  జొక్కిన భంగి నురంబునందు బ్ర
స్ఫారిత రత్న లాంఛన వి
  భా యుగళంబు దలిర్ప నొప్పు ల
క్ష్మీ రమణుం డహోబల నృ
  సింహుడు మాకు బ్రసన్నుడయ్యెన్
(భోజ 1-1)

అని కీర్తించినాడు కురంగనాభ మెదపై జెన్నొందిన శృంగారమూర్తి యగు నరసింహుని ఈ పద్యము ద్వారా అనంతామాత్యుడు చక్కగా మనకన్నుల ముందుంచినాడు

రసాల ఫలములవంటి ద్విపదకావ్యములు రచించి వార్తకెక్కిన రాచకొండ సంస్థానకవి యగు గౌరనామాత్యుడు గూడా మేధానిధి యగు నన్నయగారి ఫక్కిలోనే నవగ్రహ స్తవ పద్యములను రచించినాడట. ప్రస్తుతము అందు రెండు మాత్రమే లభ్యము అని వాటిని ప్రబంధరత్నావళికారుడు ఉదాహరించినాడు తెలుగుపలుకుబడి సొలుపును వెలార్చుచు తెల్లవారి వెలుగులవలె రంజింపజేయు ఆ పద్యము లివి

క్రమొక్క లయిక్క కాంతిగల
  మవ్వపు వేల్పులమూర్తి చీకటిన్
మెక్కెడిమిత్తి - పద్మముల
  మేలు - నవగ్రహరాజు - మింటిపై
నెక్కెడు మానికంబు - దిన
  మేలిక - సింహవిభుండు - ముక్తికిన్
జక్కెర యిందు మిత్రుడు ప్ర
  సన్నతమాకు బ్రసన్నుడయ్యెడిన్.

హరిణతలపూచకోరముల
  యామిని పాల్కడలుబ్బుమందు శ్రీ
వరుని మఱంది తారకల
  వల్లభుడిందిరతోడబుట్టు వం
బురుహాముదాయ కల్పలత
  ప్రోది యనంగునిమామ తేవిభుం
డరయగ గర్కశేశు డమ్మ
  తాంశుడు మాకు బ్రసన్నుడయ్యెడిన్

కలకలు దీరిన శరత్కాల జలములవంటి ఈపద్యములు పూర్తిగా లభించిన మన తెలుగువారికి నిత్యపారాయణ యోగ్యమైన చక్కటి నవగ్రహస్తుతి యుండెడిది. (మన సౌభాగ్యము లభించు అవకాశము ఉందో? లేదో?)

ఆధునిక కవితా జగత్తులో హిమాలయోత్తుంగశృంగమై వెలిగి కీర్తిశేషులైన శ్రీ విశ్వనాథవారు గూడ తమ శశిదూత ఖండకావ్యములో 'ఋషివంటి నన్నయ శిల్పమును అనుసరించియే కపురపుబల్కులవంటి కలకండపాకివంటి చల్ల చల్లని తియ్యతియ్యని చంద్రుని వెన్నెలలను ఉత్ప్రేక్షిస్తూ పది పద్యములు రచించినారు చెఱకున పుట్టిన పండ్లవలె ఆ పద్యములు అత్యంతమధురములు వాటిలో కొన్నింటిని రుచిచూడండి

కరకరి క్రొత్తత్రవ్వి కర
  కట్టగ బోసిన నింగిలోనం జం
దిరుడను తూమునన్ మెరుపు
  తీవల చెర్వులనుండి దంపతి
స్ఫురదురుచేతమన్ బొలము
  బోదెలవెంబడి బర్వ లెత్తుచున్
విరిసిన జాలు వెన్నెలల
  విచ్చులు మాకు బ్రసన్నమయ్యెడిన్.

అనువున మంచుచే బులక
  లై యిరులన్ గొతిమేర చేసు పూ
చిన దన, గ్రొత్తపిల్లతొగ
  చిన్నది వాలిక సిగ్గుజొల్కగ బూ
చిన దన, రేజిగాజిగులం
  చిందిన పోడుగ మిట్టుకట్టు మె
చిన దన నొప్పు నీ వెలుగు
  చిన్నెలు మాకు బ్రసన్నమయ్యె

నలువుగ వేగవేగ గమ
  నమ్ముల భక్తుల జేరు మంచుక్రో
మ్ముల దొరయల్లువాని మెయి
  మాగిన సన్నని బూదిరేణువుల్
జలజల రాలినట్లుగను
  జల్లని తెల్లనివై శిరమ్ములౌ
విలస దుదార చంద్రికల
  వెల్గులు మాకు బ్రసన్నమయ్యెడు

తొల్లిటికవుల మొదలుకొని నేటికవుల వరకు పరిశీలించిన నన్నయగారి పలుకునో వాక్యమునో ఏదోవిధముగా ఉపయోగించి రచన కావించని కవి కన్పించడు. తెలుగు కవులందరకు తరుగని కవితాభిక్ష పెట్టిన మహామహితాత్ముడు నన్నయ. అతని భారతము అనంతరత్న సంపదగల మహోదధి వంటిది అందునుండి మన మెన్ని రత్నములు స్వీకరించినను ఎప్పటికప్పుడు మరికొన్ని క్రొత్తవి పుట్టుచునే యుండును



# ❁ శ్రీ గురుస్మృతి ❁

— విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.



* శ్రీ గురుదేవదేవుని శ
రీరము భూపతనంబు గాంచఁగా
వేగమె యాత్మ పొందె నఁట
విశ్వమహాపరమాత్మరూప ము
ద్వేగము లేక శాంతమయి
విస్తృత మా జగదంతరాత్మగా
రాగము ద్వేషమున్ గనని
రమ్యనిరంజన శాశ్వత స్థితిన్

* కార్తిక వేళ శుక్లపక్షంబునందు
రౌద్రిఁ బాడ్యమి స్థిరవాసరంబునందు
గురువరేణ్యుఁడు చేరెను బరమపదము
భౌతిక శరీరబంధంబు వదలివైచి.

* పిడుగువలెన్ గఠోరమయి
వీనులకున్ విన దుర్భరంబునై
కడుఁ గదలించె నొక్కపరి
గాఢముగా హృదయంబులెల్ల నె
క్కడ జనియించె నెక్కడ సు
ఖస్థితి నుండె ననంతరంబునన్
విడిచెను దేహ మెక్కడఁ బ
విత్రముగాఁ గడు నద్భుతంబుగన్.

* జననముతోడనే కనియె
జ్ఞానవిరాగ వివేక విజ్ఞతల్
కనియెను యోగశక్తులను
గాంచెను సిద్ధుల నెన్మిదింటి స
ద్వినుతము బుద్ధివైభవము
విశ్రుత కంఠము దివ్యసుందరం
బనుపమ మాప్రవర్తన మ
హాత్ముఁ డతండు సుమస్తుతీతులన్

* పతనమె యా స్వభావ మిల
బాహ్యశరీరము లెల్లవానికిన్
క్షితి గల దేహమాత్రముల
కా దురపిల్లుట అజ్ఞులట్లు వి
జ్ఞత గలవార, లైనను వి
పాదముఁ గాంచకయుండు టెట్లు మా

కతిశయ పూజ్యపాదు లగు
నట్టి గురూత్తము లస్తమింపఁగన్

* తలలో నాలుకయై చెలంగుచు మహా
తత్త్వజ్ఞుఁడై మిత్రుఁడై
చెలియై చుట్టమునై గురుండునయి వా
సిన్ దల్లియున్ దండ్రియై
విలసద్దైవము తోడునీడ యయి స
త్ప్రేమాబ్ధియై సత్కృపా
కలితుండైన గురూత్తమోత్తమునకై
కన్నీరు మున్నీ రగున్

* అమృతము పంచిపెట్టిన మ
హాత్ముఁడు మాకును జ్ఞానబోధలో
యమునివలెన్ గనంబడి భ
యంబును గొల్పు చధర్మ మొక్కవీ
సము నొనరింపనీయక ప్ర
శస్త విధంబునఁ గాచె నెవ్వఁ డా
సుమహిత సద్గురుండు చన
శోకము గాక సుఖంబు కల్గునే?

* జ్ఞానము గీన మెుక్కయెడఁ
జక్కగ నెక్కడనో యటుంచి వి
జ్ఞానముఁ గొంత నే పెటనో
కన్పడనీయక యుంచి యేర్చెదన్
మానసశుద్ధికోసము ను
మాగురు భాస్కరుఁ డస్తమింపఁగా
నే నెటు లేద్వకోందుఁ గడు
నీరగు బాయిరూ విన్న యంత నే

* పానుఁగుంబాటి కులాబ్ధి సోముఁ
డగుచున్ బుట్టెన్ మహాంధ్రంబునన్
కనియెన్ షోడశసత్కళల్ పడసె సు
జ్ఞానంబు విజ్ఞానమున్
దునిమెన్ బంధములెల్ల బాల్యమున నే
దోబూచులాడెన్ మహా
మనిస ఘు బులతో మహామహిముఁడై
పొందెన్ జిదాత్మస్థితిన్

* తలఁచిన యంతమాత్రమునఁ
దక్షణమే సమకూరి తీరఁగా
వలయును నేదియైనఁ బొర
పాటు ప్రమాదము మందుకైన నా
యలఘునియందుఁ గానము మ
హాతపమే యగు భోజనంబు ని
ద్రిలి యెఱుఁగండు బద్ధకము
తీవ్రత దోష మెఱుంగఁ డేమియున్

* కారణజన్ముఁడై భవముఁ
గాంచుట తోఁచును నస్మదాదులా
వారల పూర్వపుణ్యమున
భాగ్యము పండఁగఁ జేసి మాకు నీ
క్షా రమణీయుఁడై పరమ
సంపద జ్ఞానము పంచిపెట్టి వి
స్తారము తీరఁగాఁ బని స్వ
ధామము మోక్షముఁ గాంచెనిత్యుఁడై.

* ఆతఁడు శాశ్వతుండు లయ
మన్నది లేని నిరంజనుండు వి
ఖ్యాతుఁడు మోదఖేదముల
యందుఁ దగుల్కొనఁబోని జ్ఞానియై
చేతము నిత్యమున్ నిలిపె
శ్రీపరమాత్మునియందె తన్మహా
పూతచరిత్ర మెంతయును
బుణ్యవిధాయక మస్వతీయమున్.

* నాకు గురూత్తముండయిన
నాఁడె మహాత్ముఁడు వత్సలత్వ శు
క్లోకుఁడు ప్రేమవీక్షణము
లో మధుహాసములో రవంత యే
దో కలిపెన్ మహత్తు మహి
తుండు క్షణంబున మాఱిపోయి వి
ద్యా కలితుండనైతిని ని
తాంత పవిత్రము మానసంబుగాన్

* భారతవర్ష పుణ్య బుషి
వర్యుల జీవితముల్ రచింపఁగాఁ

ప్రేరణ నిచ్చి శక్తి నిడి
విశ్వనుతంబుగ వ్రాయఁజేసి వి
స్తార యశం బొసంగిన బు
ధ ప్రవరున్ వినుతింతు మద్గురున్
భారతదేశ పుణ్యపథ
వర్తులలోఁ బ్రథమున్ మహామహున్.
* శ్రీరామాయణ కావ్యనాటకములన్
శ్రీభారతామ్నాయమున్
శ్రీరమ్యం బగు దేవిభాగవతమున్
శ్రీకృష్ణ విష్ణుత్వవి
స్ఫారంబై తగు విష్ణుభాగవతమున్
శశ్వన్మహామంగళ
శ్రీరమ్యం బగు వేంకటేశ్వరకవి
శ్రీదైవ పత్కావ్యమున్
• శతకవితానముల్ సురస
శాశ్వతసుందరకావ్య రాజముల్
వితతము లైన గ్రంథములు
పెక్కులు వ్రాయుట సాధ్యమయ్యె నే
యతిశయ సద్గురూత్తముని
యాశిషముల్ కతమై మహాత్మున
ద్భుతగురుమూర్తి పాదముల
తోఁ బనిగా కితరంబు లేలొకో
• ఎనుబదియేండ్లు పైబడిన
నేఁగెను ఝాన్సి పఖాడియాను నం
దున నొక యాశ్రమంబున జ
తుర్ముఖశాలను గట్టి యందులో
వినుతతపంబు చేయుచును
బిడ్డలు మువ్వురు సేవచేయఁగాఁ
గనుచును నండి రౌద్రి సుఖ
కార్తికశుద్ధము పాడ్యమిన్ గటా!
తనువును వీడి యేఁగె నఁట
తన్మహనీయుని యాత్మ భౌతికం
బను కౌఁజసాల వీడి మహి
తానుపమం బగు శాశ్వతత్వమున్
గనియెను, ఆత్మకోశమయి
కాంచుట వంత వివేకహీన బు
ద్ధిని గనుటౌ శరీరము మృతి
తిం గనుటన్నది సాజమేకదా!
వంతను గాంచు టేవిధిని
వ్యర్థమె యౌను మహానుభావుఁడా
వంతయు సంశయంబుఁ గన
మందుఁ దదీయమహాప్రబోధముల్

వింతలు శాశ్వతంబులు వి
వేకయుతంబులు ఆచరించు టే
సాంతము వాని సత్యమగు
జ్ఞానము వేఱె వివాద మేటికిన్
పానుగుపాటి వెంకయగారిపుత్రరత్న
మఖిలవిద్యావివేకం బు నందినతఁడు
గానవిద్యా విశారదుఁ డైనవాఁడు
సదమలాఖండవిజ్ఞాని జ్ఞానివరుఁడు
ఏషణత్రయమును నేనాఁడొ త్యజియించె
వైరాగ్యమే ఊఁతపట్టు కాఁగ
అష్టసిద్ధులు కాంచి నట్టివాఁడైనను
దేనికి నెప్పుడు లోను గాఁడు
అత్యద్భుతంబు తా నన్నిశక్తులు నుండి
యేశక్తిఁ జూపింపఁ డెవరికొఱకు
ప్రకటించుకొనఁడు తా స్వయముగా
నేమియును

నెవని మెప్పును గోరఁ డించుకైన
అనుపమాచరణం బె మెచ్చును తదీయ
విరహితం బెన్నఁడును లక్ష్యపెట్టఁడండె
తపము తపమే తలంపఁ బ్రధాన మనుచు
వేఱు వల దేమి యనెడి పవిత్రమూర్తి
భౌతిక నామరూపముల
వ్యక్తము కాఁడు గతంబురీతి వి
ఖ్యాతమహాత్మరూపమునఁ
గాని యతం డగు నవ్యయుండు ని
ష్ణాతుఁడు స్వస్వరూపనిజ
సౌఖ్యమహోన్నతి మద్గురూత్తమ
జ్యోతి వెలుంగు లోకముల
శుద్ధపవిత్రత సత్త్వవంతమై
* గురువరు జ్ఞానజ్యోతియె
పరగున్ ధ్రువతారగాఁ గఁ బథదర్శకమై
సురుచిర మోక్షశ్రీకిని
నిరవై తద్భక్తజనుల నెల్లరఁ బ్రోవన్
* అతఁడు చూపినమార్గ మత్యంత శుభద
మతని బోధము నిత్యోజ్జ్వలాతిశయము
ఆమహాత్ము నాశీస్సు శ్రీరామరక్ష
అతని సంస్మృతి నిత్యశోభాకరంబు
* శాంతము చిత్స్వరూపమును
సత్త్వయుతంబును సుందరంబు న
శ్రాంత శివంకరంబు నగు
శాశ్వతరూపము నందినట్టి మా

యాంతరసద్గురూత్తమ మ
హా మహిమోన్నతు బ్రహ్మరూపు నే
సంతత వందనములను
సత్కృపఁ బ్రోవఁగ సంస్మరించెదన్.
* చినసుబ్బారావన నా
తని భౌతికనామ మలరెఁ దల్లి జనించెన్
వినుతం బగు తుమ్మలపలి
ఘనవంశమునందుఁ బుణ్యకలితగ నలరెన్
* శ్యామలకోట కాకపురి
సన్నుతమై తగు రాజమండ్రి యీ
ధీమహితుండు బాల్యమున
దివ్యమహామహిమల్ వెలార్చి యు
ద్దామతఁ గన్న గ్రామములు
తా తెలిదేవరవారి యల్లుఁడై
క్షేమశుభంబు లిచ్చె జని
చేతనె యోగియు జ్ఞానియై కడున్.
* దేశము దేశ మాపయిని
దివ్యవిధంబున సంచరించె నే
దేశమునందుఁ గాలిడిన
దివ్యత నయ్యది కాంచి మించె ను
ద్దేశము భక్తరక్షణము
దివ్యతపస్సు చరింప నెల్లెడన్
లేశము తోన నుంచుకొన
లే దెపు డెట్లు చరింప నేర్చెనో!
* ఉన్నత మా విమానమున
నుత్తమ మా ప్రథమంపుఁ గక్ష్యలో
నెన్నఁడు నేఁగెఁగాని కని
యెన్నఁ డెఱుంగఁడు లోపమేదియొ
సన్నుత దివ్యశక్తి గల
జాతక మాతని దేమి చెప్పఁగా
నెన్నఁడు నొప్పుకోఁడు కథ
యీతని దొ నొక భారతం బహో!
* ధన్యులు తత్సమాగమము
ధాత్రిని గన్న సమస్త మానవుల్
ధన్యులు శిష్యరత్నములు
ధన్యులు మిత్రులు బంధువుల్ సదా
ధన్యులు తచ్చరిత్రము ము
దంబున విన్న మహానుభావులున్
ధన్యుఁడ ధన్యుఁడన్ బరమ
ధన్యుఁడఁ దత్స్మృతిచేత నీవిధిన్.

# విద్యాలయములు - ఆంధ్రభాషా బోధనము

- డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని

తెలుగు జీవద్భాష. దీనిని భాషించు వారి సంఖ్య నాలుగైదు కోట్లవఱకు నుండును. నిత్యజన వ్యవహారమున నున్న భాషలో కాలక్రమమున కొన్ని మార్పులు ప్రవేశించుచుండుట సహజము. నన్నయ భారతమందలి భాష నిప్పటి భాషతో పోల్చి చూచినచో ఆ మార్పులు స్పష్టముగా గోచరించును. వచ్చినవాడు వంటి ప్రయోగములు తరువాత వచ్చినాడువంటి రూపములుగా మాఱినవి ఇవే యిప్పుడు వచ్చినాడు, వచ్చాడు, వచ్చిండు అను రూపములతో వివిధప్రాంతములందు వినవచ్చుచున్నవి నన్నయ కూతు శబ్దమును ప్రథమైకవచనమున కూతురు అనియు, బహువచనమున కూతులు అనియు వాడియుండెను తిక్కన్న కూతుండ్రు అను రూపమును ప్రయోగించెను. ఇప్పుడు కూతుర్లు, కూతుళ్ళు అను రూపములు కూడ వినవచ్చుచున్నవి ఇట్టి మార్పులింకను పెక్కు కలవు వీనిలో శ్రవణపేయములైన వానిని కవులు గ్రహించి తమకావ్యములలో వాడియుండిరి మహాకవులు ప్రయోగించిన రూపములనన్నిటిని వ్యాకరణ కర్తలు గ్రహించి అవి యెట్లేర్పడెనో సూచించుటకు సూత్రములు వ్రాయవలెను ‘ప్రయోగశరణా వైయాకరణాః’ అంతేకాని వారు నిరంకుశులు కారు, కాగూడదు జీవద్భాషలో కాలక్రమమున కొన్ని మార్పులు కలుగుచుండును కావున ఆ మార్పులను సూచించుటకు క్రొత్త వ్యాకరణములను రచింపవలసిన ఆవశ్యకతయున్నది ఏ వ్యాకరణకర్తయైనను తనకు ముందున్న మహాకవుల ప్రయోగముల నంగీకరింపనిచో అతని

కవుల ప్రయోగములను బాలవ్యాకరణమున గ్రహించి యుండలేదు అందుకు కారణములు లేకపోలేదు అయినను అతని వ్యాకరణమును తు చ తప్పకుండ అనుసరింపవలసిన అక్కఱలేదు కవిప్రయుక్తములైన రూపముల నన్నిటిని మన మిప్పుడు గ్రహింపవచ్చును అతడు విరళప్రయుక్తములైన కొన్నిరూపముల నొప్పరికించి యుండుటేకాక నిషేధించి కూడ నుండెను

ఆంధ్రశబ్ద చింతామణి ఆంధ్రమునకు మొదటి వ్యాకరణముగా పరిగణింపబడుచున్నది. తత్కర్త యెవ్వరైనను ‘సంస్కారార్థో నియమః’ అనియు ‘గ్రామ్యం హి యత్వపభ్రంశః’ అని నియమము పొందుపఱచవలెనో, అది లేని భాష యేమగునో, దాని నేమందురో తెల్పియుండెను నియమరహితమైన భాష గ్రామ్యము, అదే అపభ్రంశము చిన్నయసూరి లక్షణవిరుద్ధమైన గ్రామ్యమనియు, అది ప్రయోగమున కనర్హమనియు తెల్పియుండెను అతడే ఆర్యజనవ్యవహారదృష్టమగు భాష గ్రామ్యమని చెప్పి పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యమైనను గ్రహింపనగు నని వివరించెను అతడిందు కిచ్చిన ఉదాహరణములను బట్టి పెద్దలనగా కవులనియే భావించినట్లు తోచును చిన్నయసూరి బాలవ్యాకరణము రచించిన తరువాత పండితులు, కవులు, విద్యార్థులు దానినే అవశ్యప్రాయముగా గ్రహించిరి ఇప్పటికిని విద్యాలయ కళాశాలలందు అదియే పాఠ్యగ్రంథముగా నున్నది అందుకు కారణ మట్టి రచనాపాటవముగల వ్యాకరణము తెలుగున మఱియొకటి లేకపోవుట

కీ. శే. గిడుగురామమూర్తి పంతులు తత్త్వశాస్త్రవేత్తలు వారి ప్రయోగవిజ్ఞాన మనన్యసామాన్యము వారు పూర్వకవుల రచనలు పెక్కులు పరిశీలించిరి అందలి కొన్ని ప్రయోగములను సూరి గ్రహింపనిమాట సత్యమే ప్రౌఢవ్యాకరణకర్త అనుక్తములైన వానిని వివరించెను, అనుక్తములైన వానిని తెల్పెను, దురుక్తములని తోచినవానిని సవరించెను అతడు తనకు కనబడినంత వఱకు కవులు ప్రయోగించిన రూపములన్నిటికిని సూత్రములు రచించెను అది రామ పంతులుగారికి సంతృప్తి కలిగింపలేదు వారు వ్యవహారమునందున్న భాషలోనే రచయితలు రచనలు సాగింపవలెననియు, విద్యాలయములందుకూడ వ్యవహారభాషనే వాడవలయుననియు వాదము లేవదీసిరి అందుకు వారు తమనాడు సుప్రసిద్ధులైన కవిపండితుల గ్రంథములు పరిశీలించి, అందు సూరి చెప్పిన లక్షణమునకు విరుద్ధములైన ప్రయోగములను కొన్నిటిని చూపి పండితులే నిర్దుష్టముగా వ్రాయలేని గ్రాంథికభాషను సామాన్యులును, విద్యార్థులును, ఎట్లు వ్రాయగలరని యొక కారణము సూచించిరి ఇచ్చట నొక ముఖ్యమైన విషయము గమనింపవలసియున్నది వారు ప్రసిద్ధకవి పండితుల రచనలనుండి చూపిన లక్షణవిరుద్ధ ప్రయోగముల సంఖ్య అత్యల్పము అవి ప్రమాదపతితములు. ప్రమాదము లెవరికుండవు? వానినిమాత్రమే గణించి, భాష నంతను మార్చవలెననుట యెంతవఱకు ఉచితమో పెద్దలాలోచింపవలసియున్నది.

వ్యావహారిక భాష, శిష్టవ్యావహారికము అను గౌరవనామములతో పేర్కొనబడుచున్న గ్రామ్యము (ఆంధ్రశబ్దచింతామణి దీనినే అపభ్రంశమనెను) ఇప్పుడు పెక్కురచనలలోకి వచ్చుచున్నది ఇది క్రమముగా పాఠ్యగ్రంథములలో కూడ స్థానము సంపాదించినది విశ్వవిద్యాలయ

చున్నది దాని కొక నియమము లేదు, అది కామచారి అనగా ఎవరియిష్టము వచ్చినట్లు వారు వ్రాయవచ్చును వ్యవహారము పలుప్రాంతముల, పలుజనసమూహములలో పలువిధములుగా నుండును దానికి సమానత్వము కల్పించుట దుష్కరము అది ఒక మహాప్రవాహమువలె ఉరవడితో వచ్చుచు 'దేశభాషలందు తెలుగు లెస్స' అని పేరు వడసిన సుందరమైన భాషకు వైరూప్యము కలిగించుచున్నది ఆ ప్రవాహమున పడి కొట్టుకొని పోవుటయో దాని నరికట్టి భాషకు సురలస్థాపనము చేకూర్చుటో యిప్పుడు చేయవలసియున్నది కొట్టుకొని పోవుట సులభమే కాని దానివలన నష్టము లనేకము లున్నవి అరికట్టుట క్లేశకరమేకాని దాని వలన లాభము లనేకము లున్నవి

భాష నాధునికీకరింపవలయు నని కొందఱనుచుందురు. ఆధునికీకరించుట యనగా నాధునిక భావముల నన్నిటిని వ్యక్తీకరింపగల శక్తి నొసంగుట ఇప్పుడు విజ్ఞానశాస్త్రశాఖ లెన్నో తెఱంగుల అభివృద్ధినందినవి ఆవిషయమున మనకంటె పాశ్చాత్యు లెంతో ప్రగతి సాధించియున్నారు ఆ శాస్త్రపరిశోధనల నన్నిటిని మనము మనభాషలో వ్యక్తీకరించుటకు యత్నింపవలయును అందెన్నో పారిభాషికపదము లుండును, ఎన్నోనూతనాశయము లుండును వాని నన్నిటిని మేధావులు మనభాషలోనికి తేవలయును పూర్వము భారతము ననువదించునప్పుడు తిక్కన గూడ తాత్త్విక భావములను కూడ 'నాంధ్రావళి మోదముం బొరయునట్లుగా' తెలుగుభాషలో వ్యక్తీకరించుటకు యత్నించి కృతకృత్యుడయ్యెను అట్టి ప్రయత్నమిప్పుడు జరుగవలసియున్నది ఆధునికీకరణ మనగా కొందఱు వ్యావహారిక భాషలో వ్రాయుట అని భావించుచున్నారు ఆధునికీకరణ మనగా ఆంగ్లీకరణము కాదు క్లిష్టములైన యెట్టి ఆధునిక భావములనైనను మన భాషలో వ్యక్తము చేయుట అందుకు వ్యావహారిక భాషనే ఆశ్రయింప నక్కఱలేదు.

ఏభాషనైనను వ్యాకరణయుక్తముగను, సలక్షణముగను వ్రాయుటకు కొంత శ్రమపడవలసిన అవసర ముండును దానికి పెక్కు గ్రంథములు చదువ వలయును, భాషయందలి జాతీయముల నలవఱుచుకొనవలయును, కొంత వ్యాకరణము నభ్యసింపవలయును శ్రమపడవలయును కదా యని దాని నుజ్జగించి యథేచ్ఛముగా వ్రాయుదొడంగుట భాష కెంతో అపకారము చేయుట యగును మన మాంగ్లభాష నభ్యసించుటకు సంస్కృతముపై నాధారపడియుంటిమి ఆంగ్లభాష మన దేశమున ప్రచారము నందకపూర్వము మన రచనలలో సంస్కృతభాషా సారస్వతముల ప్రభావ మెన్నో విధముల గోచరించు చుండెను ఆంగ్లభాష ప్రచారమందిన తరువాత దాని ప్రభావ మెక్కువగా గోచరించుచున్నది. మన మా రెండింటిలో నేదో యొక దాని నాదర్శముగా గ్రహింపవలయును మనది 'తృతీయఃపంథాః' కాకూడదు సంస్కృతమునందెన్నో శాస్త్రగ్రంథము లున్నవి ఆంగ్లమున నంతకంటెను శాస్త్రగ్రంథముల సంఖ్య హెచ్చు ఆ గ్రంథములయం దెట్టి భాషవాడబడినది? అది గ్రాంథికమా? గ్రామ్యమా? అట్టి భాష వాడుట వలన నా గ్రంథముల కెట్టి లాఘవమైన చేకూరెనా? అందు వ్యాకరణ దోషము లుండునా? వర్ణక్రమదోషము లుండునా? వాక్యదోషము లుండునా? ఉన్నచో వానిని పండితు లంగీకరింతురా? భాషేతర విషయములకు సంబంధించిన పాఠ్యగ్రంథములలో మన మేల నియమరహితమైన భాష వాడవలయును? ఇది అశక్తియా? అభివృద్ధియా?

# రాష్ట్రగానము

కవిమిత్ర శ్రీవసంతరావురామకృష్ణారావు, ఎం. ఏ.

* కలము ఖడ్గము పట్టగల నేర్పు రూపించి
 వెలుగొందువాడు, మా తెలుగువాడు
నిర్మలమగునట్టి ధర్మము పాటించి
 తేజరిల్లెడువాడు, తెలుగువాడు
మాతృదేశస్ఫూర్తి మాన్యత వెలయించి
 విలసిల్లువాడు మా తెలుగువాడు
సహనంపు సహజీవ సౌశీల్యముల చేత
 పులకరించెడు వాడు తెలుగు వాడు
ఆంధ్రుడవ భవ్యభరత భాగ్యాధినేత!
ఆంధ్రుడే కద విశ్వవిఖ్యాతమూర్తి!
ఆంధ్రుడందించు భోగభాగ్యముల గొనుచు
వెలుగుగావుత! రాష్ట్రము! కలిమినిండ!

* ఇది మహనీయమంజుల స
 మీప్సిత రాష్ట్రము, నిత్యనూత్నసం
పద గడియించి కొన్న రస
 వాహిని, బంగరుభూమి, మంగళా
స్పదమయి రాష్ట్రలక్ష్మి నవ
 భావము లుప్పతిలంగ నొప్పుచున్
విదితయశంబు గాంచుత ప
 విత్రత, మాన్యత పాదుకొల్పుచున్.

* రాష్ట్రభవితవ్యమాశించి, శ్రమలకోర్చి
దీక్షమీరగ కృషిసల్పి, తెలుగువారు
ప్రగతి పథమున జీవనసుగతిగాంచి,
ముదముగాంతురుగాత! సంపదలనంది!

* శ్రీరంజిల్లు మనోజ్ఞ భారత ధరి
 త్రీ భాగధేయంబు, రా
గారంభం బగునట్లు నాంధ్రజన భ
 వ్యంబై రసావిష్టమై
సారోదార యశంబు గాంచుమను! ప్రా
 శస్త్యంబు రూపింప వి
స్తారప్రాభవ భావనా నిలయమై
 ధన్యత్వమున్ పొందుతన్!

# గురజాడ 'పూర్ణమ్మ'
# కన్నీరు 'నిండినమ్మ' కథ

- 'భారతీప్రియ' శ్రీ వి సత్యనారాయణ, ఎం ఏ

పూర్ణము అనగా నిండినది దేనితో నిండినది? కన్నీటితో గురజాడవారి 'పూర్ణమ్మ' జీవితగాథయంతయు నిజంగా శోకబాష్పపూర్ణమే కదా! కవి యీ పాత్రకు మరొక పేరుంచక 'పూర్ణమ్మ' అని వుంచుటలో గల ఆంతర్య మిది యని తోచుచున్నది

ఆమె జీవితమొక కోన ఆ కోన కొండలవంటి కష్టాలనడుమ నున్నది కనుకనే ఆమె కన్నుల కాంతులు మేనిపసలు, నడకల బెడగులు ఏయేప్రకృతి సుందర వస్తువుల నుంచి దిగివచ్చాయో కడకు ఆయా రామణీయకతలలోనే సంలీనమై పోగా పూర్ణమ్మ పంచత్వము నొందినది

'కొండల నడుమను కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొకటుంది'

అను చరణములోను,

'కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి చేరెను మేనిపసల్
హంసల చేరెను నడకల బెడగులు'

అను చరణములోను పైభావమే అంతర్లీనమై యున్నది

'కొలను గట్టునా కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మా'

అన్నమాట లున్న చరణము ముగియగనే

'పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ'

అను మాటలుగల చరణమును ప్రారంభించుటలో మహాకవి ఈ క్రింది భావమును సూచించుచున్నాడు

ఆ దుర్గమ్మ బంగరుది ఈ పూర్ణమ్మ పుత్తడిబొమ్మ పదములలోనే భేదముగాని పదార్థమొక్కటియే గదా! కలిసిపోవలసిన తరుణ మాసన్నమయినప్పుడు కలసిపోవుట ప్రకృతిసహజమే గదా చిత్రమేమనగా కథలో చివరికటులే జరిగినది కూడా! పుత్తడిబొమ్మ పూర్ణమ్మకు బంగరు దుర్గమ్మ ఇష్టదైవం కావడం కూడా యీ సామ్యము వలననే జరిగింది,

'ఏయే వేళల పూచే పువ్వుల
నాయా వేళల అందించి'యు,
'ఏయేఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి'యు
'బంగరుదుర్గను భక్తితో కొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ'

అయితే ఆపూవులను, ఆపళ్ళను స్వీకరించుటతో తృప్తిపడలేదు దుర్గమ్మ పూర్ణమ్మనే కోరింది ఎందుకు? ఈ ప్రశ్నకు సమాధాన మిచ్చుట కోసమే ఈ చరణాలు ముగియగనే మొదలైన చరణ ముద్దేశింపబడింది చూడండి

'పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు'

కనుకనే దుర్గమ్మ కోరుగా పూర్ణమ్మను తన కడకే రప్పించుకొంది చివరకు ఇదే కథలో ప్రధానాంశము

ఇలా 'రప్పించుకొనుట'కు విస్తృతమైన వర్ణనలతో నేమాత్రము ఆలస్యము చేయకుండా తరువాతి చరణంలోనే నాంది పలికాడు గురజాడ

'కాసుకు లోనై తల్లీ తండ్రీ
నయమూ న్యాయం విడనాడీ
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను ఒక
ముదుసలి మొగుడికి ముడివేసీ'

'ముడివేయ'గా చూచినవారు హేళనగా నవ్వుకోరూ మరి? మానవుల మాట అటుంచి పువ్వులూ, పక్షులే నవ్వుకొన్నవి ముందుగా.

'ఆమని రాగా దుర్గకోనలో
కలకల నవ్వెను తామరలు
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు'

కాకపోతే పూవులవంటి పూబోణులు పక్షులవంటి స్వేచ్ఛ గలవారు లేకపోతే తామరసాక్షులు, కీరవాణులు నవ్వుకున్నారు

ప్రపంచానికంతా ఆమని వచ్చింది ఆమె జీవితానికింకా ఆమని రానే లేదు. ఆమని అంటూ ఒకటుంటేకదా రావడానికి? పాప మామె బ్రతుకు నోచుకోలేక పోయింది! ఎందుకు? 'ముదుసలి మొగుడికి ముడివేసి' నప్పుడే 'ఆకురాలుకాలం' లో అడుగుపెట్టింది పూర్ణమ్మ

ఇక్కడ ఆమె అడుగుపెట్టనే లేదు నిజముగా పూర్ణమ్మ 'బొమ్మ'వలె స్వేచ్ఛ లేనిది కాబట్టే 'కాసుకు లోనైన తల్లిదండ్రుల చేత బలవంతముగా 'అడుగుపెట్టించ బడినది 'బొమ్మ' పుత్తడిదైనను ఆడునే గాని ఆడించుట తెలియదుగదా! ఈ విషయము సూచించుటకే పూర్ణమ్మ పాత్రను కథలో ప్రవేశపెట్టినపుడే 'పూజారింటను పుట్టెను చిన్నది పుత్తడిబొమ్మా పూర్ణమ్మ' అనియు, ఇచటనే కాక కథలో చాలా 'చోట్ల పూర్ణమ్మకు విశేషణముగా పుత్తడిబొమ్మ' అనియు వాడినాడు కవి

నవ్వులను విచ్చుకొనుటగా భావించి 'దుర్గకొలనులో తామరలు కలకల మని విచ్చుకొన్నాయి' వాటి ప్రియుడైన

బాలభానుని కరముల కౌగిలిలోనే కదా అవి విచ్చుకునేది? ఇది 'పూర్ణమ్మ జీవిత మర్దినమున,నిక భానుడుదయించడు'అని గేలిసేయుటను సూచించును

ఇది తలపులోవున్న పూర్ణమ్మ కొలను వైపు చూచింది. తామరలు కలకల మని నివ్వినాయో లేక ఆమె కన్నుదామరల కట్లు కనిపించినాయో! 'యద్భావం తద్భవతి!'

పూర్ణమ్మ దుఃఖించింది కొన్నాళ్ళకు పతి గానిపోవచ్చును కాపురానికి వెళ్ళవలె పూర్ణమ్మ తన్నియిష్టదైవం దుర్గను తనవారి కప్పజెప్పింది 'కొలుచుకోం' డన్నది సోదరులతో -

'నలుగురు కూచుని నవ్వేవేళల
నా పేరొకపరి తలవండి.
మీ మీ కన్నబిడ్డల నొక తెవు
ప్రేమను నాపే రివ్వండి'

అన్నది

ఈ చరణమున గురజాడవారి విషాదాంత కవితాకథాశిల్పము తారస్థాయి నందుకొన్నది ఈ చరణము పాఠకుల హృదయములోని ఒక విషాదతంత్రిని మీటగలుగునట్లు నేర్పుగా మలచారు గురజాడవారు

సృష్టిలో మానవుడు సహజంగా కోరుకునేది సుఖము ఆనందము హృదయంలో ఉదయించే ఆనందానికి బాహ్యస్పందనము నవ్వు నలుగురూ కూచుని నవ్వే వేళల 'నా పేరొకపరి తలపులోనికి రాగానే మీరు హాయిగా నవ్వగలిగితే నాకేవిధమయిన అన్యాయమూ జరుగలేదని గ్రహించండి మీకు నిజముగా మానవత్వము కలిగినవారైతే నా పేరు జ్ఞప్తికి రాగానే మీ హృదయాలు శోకపూర్ణాలౌతాయి అప్పుడు నా కన్యాయము జరిగిందని గ్రహించండి అప్పుడు పెళ్ళిళ్ళు కావలసిన కన్యలపట్ల నెరవేరవలసిన మీ బాధ్యత ఎటువంటిదో మీకు తెలిసిరాగలదు

ఈ 'తెలిసిరావడము' నేనిప్పుడు కాపురానికి వెళ్ళి శ్రీమతిగా సంసారజీవితము ప్రారంభించిన జరుగదు కన్యగా జీవితమునుండి నిష్క్రమించిననే జరుగుతుంది' అన్న భావము ధ్వనిగా ఈ చరణంలో వుంది

తొలుత ఎటులో కాసుకు లోనైన తండ్రి బలవంతంతో తల్లికూడా ఒప్పుకున్నది (కాసుకు లోనైన తల్లీ దండ్రీ) కాని చివరకు తన పొరపాటును తెలుసుకొని 'తల్లియు కంటను తడిపెట్టెన్' ఎంతైనను స్త్రీహృదయములోని వ్యథ స్త్రీహృదయమే అర్థము చేసికోగలదు గాని 'కాసుకులోనై అల్లుని దలచుక ఆనందించే అయ్య' హృదయ మెట్లర్థము చేసికోగలదు? కాని కూతురి బాధ నప్పుడర్థము చేసికోగల్గియు తల్లి చేయజాలిన దేమియూ లేదు చేతులు కాలేక ఆకులు పట్టుకుంటే ఫల మేమి? తండ్రి తన కూతురి సమస్య నర్థము చేసికోలేక పోవుట యెంత ప్రయోజనశూన్యమో తల్లి అర్థము చేసికొ ల్గుట కూడ అంతే ప్రయోజన శూన్యము ఎంతయినా పుత్తడి 'బొమ్మ'ను కన్నతల్లి కదా!

'వగచిరి వదినలు - వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టెన్'

అన్నప్పుడు మనమనస్సు చివుక్కుమనును

'కాసుకులోనై అల్లుని దలచుక
ఆనందించెను అయ్యొకడే'

అన్నప్పుడు అయ్యను దలచి మనకు నవ్వు వచ్చును

'ఆరోజు దుర్గను కొలువను ఒంటిగ పోయెను పూర్ణమ్మ' సాయంత్రమయింది.

'ఆవులు పెయ్యలు మందను జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు
పొడమెను
ఇంటికి పూర్ణమ, రాదాయె'

అప్పటికే మింట చుక్కల్లో చేరిపోయింది పూర్ణమ్మ

కన్నులకాంతులు కలువల జేరెను
మేలిమి జేరెను మేనిపసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ'

ఈచరణము కవితాఖండిక కంతటికీ తలమానికము. గురజాడవారి అనన్యసామాన్యభావుకత కిది నిదర్శనము కథను విషాదాంతము చేయువేళ వినూత్నమైన విధానముగా పేర్కొనవచ్చును ఇది ఒక్క గురజాడ వారికేతగును

పుట్టుకతోనే ఆమె వెంట వచ్చిన కలువల కన్నుల కాంతులు, మేలిమిమేని పసలు, హంసల నడకల బెడగులు, ఆమె జీవితమున సార్థకతను పొందలేక పోయినవి చివరకు ఆమెనే నేపథ్యములోనికి త్రోసివేసి తాము ఆయా ప్రకృతి రామణీయకతలలో కలసిపోయినవి

పూర్ణమ్మ 'దుర్గమ్మగుడిని' చేరలేదు సరాసరి దుర్గమ్మనే చేరింది ('దుర్గను జేరెను పూర్ణమ్మ') అందుకే 'యింటికి రాదాయె'

మరొక విధముగా చూచినను దుర్గ యనగా 'చేరరానిది' పూర్ణమ్మ చేరినది కూడా చేరరాని చోటికే కదా!

## మా తెల్గు కవులు

- భాషాప్రవీణ శ్రీ ధూళిపాళ
అర్కసోమయాజి, బి. ఏ.

~~~ ~~~

\* సన్నుతిమీరగా నిలఁ బ్ర
  సన్న కథాకలితార్థయుక్తితో
నున్నతికెక్క భారతము
  నున్ దగఁ దీర్చి సత్కవిత్వపుం
గన్నియ నాదరించి యుగ
  కర్తయు, నాదికవీంద్రుడైన మా
నన్నయ నెంచి మ్రొక్కెదు మ
  నమ్మున గర్వపురేఖ వెల్గగన్

\* చక్కని తోఁట తెన్గుసాన
  జారగఁ గావ్యమరందమాధురుల్
గ్రక్క పదేనుపర్వములఁ
  గూర్చిన జాణయు, నాటకీయతా
ఫక్కికి మూలమై తెలుగు
  వాఙ్మయశాఖకు బ్రహ్మయైన మా
తిక్కన సోమయాజిని ను
  తించి యొసంగెద నక్షరాంజలిన్.

\* శంభినీ తలి నన్నపార్యుని
  కూర్మిమీరెడు కైతవన్
సంభవించిన లోటుఁ గైకొని
  చక్కదీర్పఁగ నెంచి ప్రా
రంభముం దగఁ జేసి శారద
  రాత్రిఁ బట్టిన యట్టి మా
శంభుదాసకవీంద్రు నిమ్ముగ
  సన్నుతించుచు మ్రొక్కెదన్

♦ చిరుతప్రాయమునుండి యాశుకవితా
  సి హాసనారూఢుఁడై
వరసారస్వత పట్టభద్రుఁ డగుచున్
  బ్రౌఢ ప్రబంధావళిన్
కరమొప్పన్ రచియించినట్టి కవిలో
  క ఖ్యాతి వర్ధిష్ణు మా
సిరినాథున్ బర మేశ్వరార్చనకళా
  శీలున్ బ్రశంసించెదన్

\* కమ్మని వాక్సుధారసముఁ
  గావ్యమునందునఁ బోతఁబోసి లో
కమ్మునఁ గీర్తి నల్దిశలఁ
  గ్రమ్మగ భాగవతామృతమ్ము తా
నిమ్ముగ నీధగాస్థలిని నెల్ల
  జనాళికిఁ బంచినట్టి మా
బమ్మెర పోతరాజకవి
  వర్యున కిత్తు నమస్క్రియాంజలిన్.

---

## శ్రీశ్రీ "మరోప్రస్థానం" - ఒక పరిశీలన

- శ్రీ కె. మోహన్ రెడ్డి, ఎం. ఏ.

'మహాప్రస్థానం' రచించిన మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు. విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించిన తరువాత దశాబ్దములో వ్రాసినటువంటి కొన్ని గీతాలను విరసం వారు 'మరోప్రస్థానం' గా ప్రచురించారు శ్రీశ్రీ మొదటినుంచి విప్లవకవియే అయినప్పటికి అతణ్ణి ప్రజాకవిగా అత్యధిక ప్రజానీకానికి పరిచయం చేసింది నగ్జలరీ పోరాటం, మరియు విప్లవ రచయితల సంఘమే శ్రీశ్రీ ప్రారంభం నుండి ప్రజల తరఫున నిలబడి మార్పును ప్రబోధించే రచనలు చేసినప్పటికి తెలంగాణ రైతాంగపోరాటం గురించి ఏమీ వ్రాయకపోవడం ఆశ్చర్యమే అయినా ఇప్పటినగ్జలైట్ పోరాటానికి ప్రభావితుడై దానిని కీర్తిస్తూ అనేక రచనలు చేయడం 'మరోప్రస్థానం' లో మనకు స్పష్టంగా కనిపిస్తుంది

విప్లవకవి అయినటువంటి శ్రీశ్రీ మరోప్రస్థానం అనే శీర్షిక కల్గిన గీతంలో విప్లవం గురించి పరిచయం చేస్తూ

'విప్లవం - యాడుందిరా
అడనే - నీ కాడుందిరా
నీ గూడుందిరా'

అని అంటూ అశేషపీడిత జన హృదయాలను కదలిస్తున్నాడు పేదవారి కష్టతరమైన జీవితాలను తెలియజేస్తూ

'విప్లవం యేమందిరా
మనిషి కోకలే సావందిరా'

అని మానవజాతి మొత్తానికే పోరాటం ఊపిరిపోస్తున్నాడు

నిన్నటి జట్కావాలా అనే గీతంలో ఒక్క జట్కా మనిషి జీవితం గురించి తన సహజ కవిత్వ పదగుంభనంతో అతని దీన పరిస్థితిని కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు శ్రీశ్రీ అంతేకాదు పేదవాళ్ళుతమ జీవన భుక్తాన్ని కళ్ళదిసేవాటిని కుటుంబ సభ్యులకంటే కూడా ఎక్కువగా ప్రేమిస్తారనే విషయం శ్రీశ్రీ జట్కావాలా ద్వారా చెప్పిస్తాడు.

సాధారణ ఉగాదికి స్వాగతం పలుకుతూ ఈ ఉగాదులన్నీ సాధారణంగా వచ్చేవే వద్దన్నా ఆగేవి కా వంటాడు శ్రీశ్రీ.

'కాలం ఇంకా కళవెళా ఉడకాలి
సరియైన వంటవాళ్ళు దొరకాలి'

అనే మాటల్లో ఇంకా పరిస్థితులు పరిపక్వమై దానికి సరియైన విప్లవనాయకత్వం కావాలనే ఆశావాదం శ్రీశ్రీలో కన్పిస్తున్నది.

ఎవరిది అహింస అనే శీర్షిక కింద నగ్జలైట్లది హింస కాదంటూ వారిని (సత్యంను భాస్కరుని) చంపిన వారే హింసావాదులంటూ తాతా, బిర్లాల గుట్టును స్పష్టంగా బయటపెట్టగల్గాడు శ్రీశ్రీ 'తుది పయనం - తొలివిజయం'
~~~

అనే గీతంలో నక్సలైట్లనిగురించి వ్రాస్తూ-

'తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు
అన్నాడు
నల్లవాడు నువ్వు నేడు నక్సలైట్ వన్నాడు
ఎల్లవారు నిన్ను రేపు వేగుచుక్క
అంటారు'

అని ఏమాత్రం భయంలేకుండా చెప్తూ తాడు ఇంకా వారికి-

'ఊగరా, ఊగరా, ఊగరా
ఉరికొయ్య అందుకొని ఊగరా
ఉయ్యాల లాగ బా ఊగరా'

అని విప్లవసందేశ మిస్తున్నాడు శ్రీశ్రీ అదే విధముగా నక్సలైట్లని గురించి పాలక వర్గాలు, ధనికవర్గాలు ఏమనుకుంటు న్నారో చెపుతూ-

'మంచాలను కొలుస్తారు
మల్లన్నను తలుస్తారు
పంచాది నిర్మలంటె
భయంపుట్టి వణుకుతారు'

అని వారి వర్గభావాన్ని తెలియజేస్తున్నాడు మరొక గీతంలో శ్రీశ్రీ మహాత్మ గాంధీ అహింసా సిద్ధాంతము అమలు జరుగుట లేదని తెలియజేస్తాడు అడుగడుగునా అమానుష పైశాచికత్వమే ఎదురౌతున్నదని, దానితో అహింసా సిద్ధాంతముతో యువతరం విసిగింది అని ఈక్రింది గీతం ద్వారా తెలియజేస్తాడు

'యువతరం విసిగింది బాపూ
నవతరం విరిసింది బాబూ
వెతుకుతున్నది కొత్త రోజులు
దులుపుతున్నది పాత బూజులు'

అల్లూరి సీతారామరాజు అనే సినిమాలోని పాటలో తెలుగువారి బలపరాక్రమములు కీర్తిస్తూ, అల్లూరి సీతారామరాజు సాహసాన్ని గానంచేస్తూ మళ్ళీ ఈనాటి పరిస్థితులకు కూడా పనికివచ్చే విధంగా-

తెలుగువీర లేవరా - దీక్షబూని సాగరా
దేశమాత స్వేచ్ఛకోరి తిరుగుబాటు
చేయరా'

అనే చారిత్రాత్మక విప్లవసందేశమిస్తున్నాడు శ్రీశ్రీ అదేవిధముగా 'భూమికోసం' చిత్రంలో పేదలకు, బీదలకు, మధ్యతరగతిజనానికి, అజ్ఞానానికి,అన్యాయానికి బలిఐపోయిన వనితలకు, వారి కష్టాలనుంచి గట్టెక్కించటానికి -

'ఎవరో వస్తారని
ఏదో చేస్తారని
ఎదురుచూసి మోసపోకుమా
నిజము మరిచి నిదురపోకుమా'

అని హెచ్చరిస్తున్నాడు ఈ రకం పాటలు 'మరోప్రస్థానం' లో అచ్చు వేయడం జరిగింది

ఈనాటి రైతాంగంయొక్క గస్థితిని వర్ణిస్తూ రాజులుమారినా,రోజులుమారినా దున్నే రైతుల బ్రతుకుమారలేదని చెపుతూ వారి పోరాటం, అనంత జీవితసంగ్రామం అని తెలియజేస్తాడు

1974 లో విప్లవరచయితలను ప్రభుత్వం నిర్బంధించి అనేక కుట్రకేసులలో ఇరికించిన పరిస్థితిని సమీక్షిస్తూ-

దొంగవోట్ల దొంగనోట్ల
రాజ్యం ఒక రాజ్యమా ?
లంచగొండి వెధవలిచ్చు
సాక్ష్యం ఒక సాక్ష్యమా ?

అని సూటిగా ప్రశ్నిస్తున్నాడు 'చస్తున్న వ్యవస్థమీది వస్తున్న చరిత్రవాది' అని చరిత్రగమనాన్ని తెలియజేస్తాడు అట్లాగే-

'సమసమాజ నిర్మాణం
స్వప్నం కాదినాకు
మన యెరుకే ఈలోకం
మారుతుంది క్షణం క్షణం'

అని ప్రపంచ మార్పును ప్రవచిస్తున్నాడు మరొక గీతంలో శ్రీశ్రీ సైంటిస్టు కావాలన్నా, ఆర్టిస్టు కావాలన్నా ముందుగా కమ్యూనిస్టు కావాలని అంటాడు దానిలో ప్రతి ఒక్కడు మార్క్సిస్టు గావాలనే శ్రీశ్రీ ఉద్దేశము ద్యోతకమవుతున్నది

ఉగాది స్వగతాలు అనేగీతంలో అభ్యుదయ కవుల అవకాశవాదాన్ని, గుమస్తాల అతుకుల బతుకులను, జోహుకుం కవుల వర్గస్వభావాన్ని, సామాన్యుల నిస్సహాయతను, విప్లవకవుల మార్పువాదాన్ని మనస్సుకు హత్తుకుపోయేటంత పటుత్వముగా చెప్పాడు శ్రీశ్రీ

మహాకవిగా పేరుగాంచిన శ్రీశ్రీ అక్కడక్కడా శ్రీశ్రీ ప్రియశిష్యుడా, శ్రీశ్రీ కవిత్వాలాలసుడా, సిరిసిరి మువ్వా అని తనపతానే చెప్పుకోవటం ఏమంత మంచిగా అనిపించుకోదు అనువాద కవితల్లో 'పేదవాళ్ళ ఆగ్రహం' అనే కవిత బాగుంది కాని మిగతావి అంత బలంగా లేవు

విప్లవకవిగా ప్రసిద్ధికెక్కి, కవిత్వముపై మంచిపట్టు కలిగిన శ్రీశ్రీ కొన్ని చోట్ల విప్లవకారుల త్యాగాలను అపహాస్యము చేసే విధముగా వ్రాసాడు వెంకటాపు సత్యాన్ని గురించి-

'కొంపటాం
కాదు సంచులు నింపటం
కొంతాస్తులు పెంచటం'

అని వ్రాసాడు కొంపటాం అనే మాట వ్యంగ్యంగా వ్రాసినట్లుగా కనిపిస్తుంది. వజ్రం అనే శీర్షిక కింద తరిమెల నాగిరెడ్డిని గురించి మరీ హేళనంగా అదేదో పొగడటానికి వ్రాసినట్లుగా వ్రాసాడు. ఈ రెండు కవితల్లో అతని అభిమానులు ఆశించినంత బలంగా వ్రాయలేకపోయాడు శ్రీశ్రీ

కొన్ని అనువాద కవితలు, సినిమా పాటలు ఉన్న ఈ 'మరోప్రస్థానం' కవిత్వంలో, పటుత్వంలో 'మహాప్రస్థానం' స్థానాన్ని అందుకోలేక పోయిందనే చెప్పాలి కాని విప్లవకవిగా శ్రీశ్రీ ప్రజా పోరాటల దగ్గరకు క్రమంగా వెళ్ళుతున్నాడని 'మరోప్రస్థానం' పుస్తకము ద్వారా చెప్పవచ్చును.

# మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి- ఆపురి బాయకుండు టేల?

- శ్రీ పి ఏ వి వల్లభాచార్యులు.

'సమాలోచన' 16-11 1980 సంచిక లోని మనుచరిత్ర-ఒక పరిశీలన యను శ్రీ సి హెచ్ శ్రీరామశర్మ, ఎం. ఏ, గారి వ్యాసము చదివిన పిమ్మట 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, ఆపురి బాయకుండు' నను విషయమున నాకు తోచిన యభిప్రాయము పాఠకుల ముం దుంచవలె ననిపించినది

అల్లసానివా రంబురుహ గర్భకులాభరణంబైన ప్రవరునకు వాడిన విశేషణము 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి' శ్రీరామశర్మగారు వ్రాసిన ట్లనేక వ్యాఖ్యానములందు మకరాంకునివలె, శశాంకునివలె మనోహరరూపము గలవాడని యుండుట సత్యమే వారు మకరాంకుని కన్నను, శశాంకుని కన్నను, మనోజ్ఞమైన రూపము కలవాడనుట సమంజసమనిరి మహాకవులు వ్యర్థముగా పదములు వాడుదురా? సౌందర్యమునకు మన్మథుని నటు పిమ్మట శశాంకుని చెప్పెనా! ఈ రెండు శబ్దములు సౌందర్యమునకే సూచకములా? సౌందర్యమే సూచించు నెడ యక్షతనయ, జయంత, వసంతుల నేల యుపయోగించలేదు? అని విచారించిన నాకొక యాలోచన వచ్చినది శ్రీశర్మగారు చెప్పినట్లు శృంగారమున సౌందర్య మతిముఖ్యమే పన్నగము సుందరముగా నుండును దాని సౌందర్యము భయానకము త్పాదింపజేయును కాన శృంగారమునకు మానసాహ్లాదకారకమైన సౌందర్యము ముఖ్యము మకరాంకు డందమైనవాడు చంద్రుని ధర్మము 'ఆహ్లాదకారకత్వము' సౌందర్యమే 'శశాంక' శబ్దము సూచించు నెడ తృతీయాశ్వాసమునం 'దారవ పద్యము 'కమ్మని కుందనం' బను దానిలో నిందు బింబమున్ గిమ్మన నీ మోము' అనుటయేల? చంద్రునికన్న నందగాడనియే యయినను, శశాంక శబ్దము ఆహ్లాదము గొల్పుట' యను దాని కేల వాడియుండరాదు? ప్రవరునింటి కేతెంచిన యామధసిద్ధుడు 'ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక' యని నాడు చంద్రదర్శనము కలశోదధి నుప్పొంగ జేయును సౌందర్యము చేతనా? పుత్రుని యున్నతిని గాంచిన యాహ్లాదమునం దండ్రి యుప్పొంగుట సహజమగుట చేత, అందువలన నిచటనూ 'శశాంకు' డాహ్లాదకారకుడే అదియును గాక భవిష్యత్తునందు ప్రవరుడు వరూథినీ మనోధిపతి కాబోవుచున్నాడు మకరాంకుడు మనోజుడేగాని, మనోధిపుడుగాడు చంద్రుడు మనోధిపతి యనుట విజ్ఞు లెరిగినదే అందువలన 'మకరాంకునివలె సుందరమూ, శశాంకునివలె నాహ్లాదకరమూ అయిన రూపముగలవాడని' చెప్పుకొనుటయుక్తమని తోచుచున్నది

ఇక 'ఆపురి బాయకుండు' టకు శ్రీరామశర్మగారు 'సర్వైశ్వర్యసంపన్నుడగుట హేతువు మాతాపితృసేవనమున కంతరాయము కలుగకుండుట కూడ హేతువే' యనిరి కాని వీనికన్న సమంజసములైన కారణము లనేకము కాబడుచున్నవి ప్రవరుడు 'యౌవనమందు యజ్వయు ధనాఢ్యుడై' యెప్పుడు తరగని పాడిపంటలతో,' 'వలయు భోజ్యంబు లింట నవ్వారిగా,' 'సాలగ్రామము మున్నగాగొనక,' 'మాన్యక్షేత్రముల్ పెక్కు చందాలంబండ' నుండు నన్నది సత్యమే కాని యీసంపద కాత డిచ్చిన ప్రాధాన్యమేమి? మాతాపితృసేవ కత డొసగిన ప్రాముఖ్యమేది? తుహినగిరి కడపాద విహీనుడై యుండుటచే నాతడు 'నన్ను నిముసము చూడక నిలువలేని తండ్రి యెంతగా వెదకునో? సంధ్యాకాలముల నిలు వెడల నీక కాపాడుతల్లి యెంత దుఃఖించునో? సర్వదా మనస్సులో మెదలు భార్యయెంత బాధపడునో? ఉత్తములైన శిష్యు లెంతపరితపింతురో?' యని వారిని స్మరించి, 'యతిథిసంతర్పణంబు లేమయ్యెనో కో? యగ్ను లేమయ్యెనో కో, నిత్యంబులైన, కృత్యముల బాపి దైవంబ! కినుక నిట్లు, పాలువైచితె మిన్ను లుపడ్డచోట!' యని పరితపించినాడు అందువలన నాత డాపురి బాయకుండుటకు హేతువు 'నిత్యంబులైన కృత్యములే' కాని సర్వైశ్వర్య సంపన్నత, మాతాపితృసేవయు గావు అతని నిత్యకృత్యము లేవి? అతిథి సంతర్పణంబులు, నగ్నులు, సురార్చన, విప్రసపర్యలు అందువల్లనే యాతడు వరూథినితో -

'వేలిమియున్' సురార్చనయు
విప్రసపర్యయు జిక్క భుక్తికిన్
వేళ యతిక్రమించె జన
నీజనకుల్ కడువృద్ధు లాకటన్
సోలుచు జింతతో నెదురు
సూచుచు నుండుదు రాహితాగ్ని నే
దూలు సమస్త ధర్మములు
దొయ్యలి! నే డిలు సేరకుండినన్'

అనినాడు ఆత డిలు సేరకుండినను, యిలు వెడలినను 'సమస్త ధర్మములు దూలు' గావున నాత డాపురి బాయకుండు అంతియగాక యాతడు స్వాహావధూవల్లభుని ప్రార్థించునపుడు, దానజపాగ్నిహోత్రపరతంత్రుడ నేని, భవత్పదాంబుజ ధ్యానరతుండనేని పరదారధనంబుల గోరనేని సన్మా

నము తోడ నన్నుసదనంబున నిల్పి మీఱందు పశ్చిమాంభోనిధిలోనఁ గ్రుంకకయున్న రయంబున హవ్యవాహనా!' యని వేఁడుట ప్రొద్దుగ్రుంకకయున్న నిలుసేయుట సంధ్యావందనాగ్నిహోత్రాది కృత్యనిర్వహణమునకే కదా! తరువాతి వచనమునందు 'పావక ప్రసాద లబ్ధంబగు పవనజవంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్య సత్కర్మకలాపంబులు నిర్వర్తించె'నని చెప్పబడినది! కావున నాహితాగ్నియగు నాతడు సత్కర్మభంగకరమగునని యీ పురి బాయకుండుగాని యాతని సర్వైశ్వర్య మచట నుండుట హేతువుగాదు 'నా కరణుల్ దుర్బలు నన్నులుం బ్రియములైన ట్లన్యముల్ గావున ప్రవరున కీహేతువులచేఁ బుట విచారకరము అతఁ'డాపురిబాయకుండు'ట కాతఁడాహితాగ్నీ, యభ్యాగత సేవాపరతంత్ర సకలజీవనుడూ, నిర్మలధర్మకర్మదీక్షా పరతంత్రుడు, 'నారతాధ్యాపనతత్పరుడునగుటయే హేతువులు పెద్దన మనుచరిత్రకు మూలమైన సంస్కృత మార్కండేయ పురాణాంతర్గత గాథలోగూడ 'నభోగార్థాయ విప్రాణాం శస్యతే హి వరూథిని! ఇహ క్లేశాయ విప్రాణాం చేష్టా ప్రేత్య ఫలప్రదా!' యనినాడు ఇక ఆంధ్రీకృతిలో నడుగడుగునా సంపదలయెడ వైముఖ్యము, సత్కర్మాచరణ సుముఖత్వముఁ గానబడును కావున పై హేతువులు, వివరణము, సరియైనవని తోచుచున్నది ఈ వాదమందేమైన దోసగులున్న విజ్ఞులు తెలియజేయుదురుగాక

'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః'

# ఈ పక్షంలో

## * నన్నయ జయంతి *

ఈ నెల 16 తేదీ ఆదివారం సాయంకాలం రాజమండ్రి శరన్మండలియాజమాన్యమున మునిసిపల్ ఆఫీసు ఆవరణములో నన్నయజయంతి ఔచిత్యశోభితముగా జరగినది శరన్మండలి ఉపదేశకులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు సభకు అధ్యక్షతవహించిరి శ్రీ సత్యనారాయణశాస్త్రి గారును శ్రీ కరుటూరి సత్యనారాయణ గారును కళాప్రపూర్ణ శ్రీ దివాకర్ల వేంకటావధాని గారిని నూతనవస్త్రములతోను, ఫలతాంబూలాదులతోను సత్కరించిరి.

శ్రీ అవధానిగారు రెండుగంటలసేపు తమ మధుర ప్రసంగముతో శ్రోతల నానంద పులకితులను గావించిరి తొలుత వాల్మీకి యొక్కడే మహాకవియని అనంతరము వ్యాసునితో మహాకవు లిద్దరైనారని, తరువాత కాళిదాసు మూడవ మహాకవియని, దండిక కూడ మహాకవి పదము వర్తింపదని వక్కాణించిరి

అట్టి మహాకవికృత భారతామ్నాయమును తెలుగున వ్రాసిన నన్నయ తెలుగున ఆద్యుడైన మహాకవి యనిరి తిక్కనాదులకు నన్నయయే మార్గదర్శకు డనిరి

క్రీస్తుశకం ఒకటవశతాబ్దినుండి ఆంధ్ర భాష చరిత్రను విశదీకరించి నన్నయ భారత రచనకు కారణమును స్పష్టపఱిచిరి తూర్పుచాళుక్యులకు పశ్చిమచాళుక్యులకు గల విరోధమును, పశ్చిమచాళుక్యుల ప్రాపకము నొంది పంపమహాకవి కన్నడమున భారతమును రచించిన విధమును, మూలమునకు భిన్నముగా పంపడు చేసిన మార్పులను, కారణములను వివరించిరి.

వ్యాసభారతములోని వైదికమతార్థము స్పష్టపడునట్లు రచింపుమని రాజరాజనరేంద్రుడు కోరుటచే నన్నయ సవినయముగా అంగీకరించి కథానువాదపద్ధతిని కావ్యకళాదృష్టిని జోడించి ఆంధ్రమహాభారతరచన గావించె ననిరి

బహుభాషాభిజ్ఞుడైన నారాయణభట్టు భారత మహాసంగ్రామమున శ్రీకృష్ణుడర్జునునకు వలె మిక్కిలి వాక్సాహాయ్యమొనరించి ప్రోత్సహించినాడనియు గంటము పట్టి రచనలో మాత్రము ప్రమేయము కల్పించుకోలేదనియు, తేటపఱచిరి

మూలములోని కొన్ని అంశములను సంగ్రహించి, కొన్ని సందర్భములను విస్తరించి, కొన్నిటిని విసర్జించి, ఔచిత్యమును రసమును పోషించుచు అలంకార శోభితముగా చక్కని శైలిలో నన్నయ భారత రచన సాగించినా డనిరి యుద్ధవర్ణనలో వైవిధ్యం చూపలేకపోయినను ఇతరఅంశములలో చూపినా డనిరి. శృంగారరస వర్ణనలో నన్నయచూపిన నిగ్రహము, ఔచిత్యము అనితర సాధ్యములనిరి ప్రతి అంశమునకు భారతమునుండి అనేక ఉదాహరణములను మధురముగా ఉటంకించి చూపిరి నన్నయ్యపై తాము రచించిన పద్యముల నతి మనోహరముగా చదివి శ్రోతల నమందహర్షాబ్ధి నోలలాడించిరి ఈవిధముగా శరన్మండలివారి 'తృతీయ - నన్నయ జయంతి' అత్యంత జయప్రదముగా ముగిసినది.

## ఆంధ్ర రాష్ట్రావతరణ రజతోత్సవములు

— శ్రీ జయంతి వేంకటశాస్త్రి.

కలగా నిల్చిన రాష్ట్రసిద్ధికొఱకై
కష్టించి పెక్కండ్రు పె
ద్దలు సాధింప నశక్తులై మెలగ నం
తన్ దీక్షతో పొట్టిరా
ములు ప్రాణంబులనిచ్చి రాష్ట్రవిజయ
మ్మున్గూర్చె నీనాటి యాం
ధ్రుల స్వాతంత్ర్యమహోత్సవంబున దలం
తున్ ముదు శ్రీరాములన్॥

* తొలినాళ్ళన్ మన తెల్గుదేశమున కం
తో సేవ గావించి యు
జ్జ్వల మార్గంబున దీర్చిదిద్దిన మహో
త్సాహుండు సర్వాంధ్ర భూ
స్థలికి న్మంతిరి టంగటూరికుల భా
స్వన్మూర్తికిన్ ధైర్యస
ద్బల సత్కీర్తికి ఆంధ్రకేసరికి న
ర్పింతున్ నమోవాకముల్॥

* తెలుగుదేశప్రభాదీప్తికై తొడరిన
మహనీయ మంత్రి తిమ్మరుసు నెంచి
అరివీరభట భయంకరుడు విస్తృతకీర్తి
ఖడ్గతిక్కన పరాక్రమము దలచి
పరిపాలనాదక్ష ప్రాజ్ఞాంధ్రభూమీశ
వరులశాతుల ప్రాభవమ్ము దలచి
ఆంధ్రకవిత్రయ మాలపించిన జాడ
లాకళింపగ యత్న మాచరించి
పాలనంబున తగుసలహాలనిచ్చి
వీరచర్యలచాటింప వెలుపుగొనక
దీక్షతో పాలనంబును దిద్దితీర్చి
మసలుకొం డాంధ్రసోదర మాన్యులార!

## జ్యోతిశ్శాస్త్ర సభలు-పిడపర్తి సోదర సిద్ధాంతుల అధిక్షేపము

1980 జనవరి మూడవ వారములో రాజమండ్రిలో జరగిన జ్యోతిశ్శాస్త్రసభలను గుఱించి, అందు గావింపబడిన తీర్మానములను గుఱించి, పాడగట్లపల్లి వాస్తవ్యులైన శ్రీ పిడపర్తి సిద్ధాంతిసోదరులు (శ్రీ చిరకృష్ణమూర్తి శాస్త్రి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి) 7-3-80 తేదీ ఆంధ్రప్రభలోను 16-8-80 తేదీ సమాలోచనలోను కొన్ని అధిక్షేపపూర్వక విమర్శలు గావించియుండిరి వాటి ఔచిత్యానౌచిత్యములను సహృదయపాఠకులు గ్రహింపగలుగుటకు ముఖ్యములైన వివరణము ఈ క్రింద పొందుపఱచడ మైనది. వారి ఆక్షేపముల సారాంశము

1 మొదటి ఆహ్వానముతో పాటు పంపక ఎజెండా (చర్చనీయాంశముల పట్టిక) ఆలస్యముగా పంపిరి అది మాకు 18 తేదీని అందుటచే వ్రాతపూర్వకముగా మాఅభిప్రాయములు పంపుటకు వ్యవధి చాలలేదు మా సోదరుడైన సుబ్రహ్మణ్యశాస్త్రికి ఆహ్వానమంపలేదు

2 ఆంధ్రదేశమంతటను నిరయనపద్ధతి పంచాంగమే వాడుకలో నున్నది. సాయన పద్ధతిలో ఎవరును పంచాంగము చేయుట లేదు నిరయన పద్ధతిలోనే పంచాంగము చేయవలయునను తీర్మానము నిరర్థకము ముందెవ్వరైనా సాయన పద్ధతిననుసరింప గలరేమో అని ఈతీర్మానము గావించుట పెట్టగలపాదు కొనగలగేద తినె నన్నట్లున్నది

3 అయనాంశములు వివాదగ్రస్తములు కావు బహుపండితామోదముతో శాశ్వతనిర్ణీతములై యున్నవి. వానిని రెండుమూడు రోజులలో మార్పగలమని కొనుట వేదశాస్త్రపరిషత్తువారితోంద పాటు ఇంకను పరిశీలింప వలసియున్నదని సభవారు తీర్మానించుట అనుచితముగ నున్నది.

---

*చూపుమా తొల్లిటం గలుగు శూరుల
వీరుల త్యాగమూర్తులన్
ప్రాపకమైన సాహసములన్,
ఘన ధీరత, గీర్తిసంపదన్
రేపును మాపునున్ తెలుగు
రీతుల జ్ఞప్తికిదెచ్చి కొంచు సం
దీపన మిచ్చి తెల్గుధర
జిన్ నడపింపుడి యైక్యభావనన్

* కక్షలుమాని నీతిదెస
గ్రాలి ప్రజాపరిపాలనంబునన్
దక్షత జూపి లంచముల
దండితనంబును మాన్పి ప్రీతితో
పక్షములేని వృత్తులను
పల్వురకున్ కలిగించి దుష్టమా
రాక్షస వృత్తికి న్జొఱక
రాముని రాజ్య మనంగ నేలుడీ!

4 సిద్ధాంతరీత్యా ఒక పంచాంగం దృక్సిద్ధాంతరీత్యా కమిటీవారి పంచాంగం రెండూ ఉండవలె ననుటచే ఆచట సమావేశమైన పండితులకు, నిర్ణేతలకు దృక్సిద్ధ మన నేమో తెలియదు మేము పండితులను నిందించుటకుఁ గాక వాస్తవము చెప్పవలసి చెప్పితిమి గాన నది ఎవరికైన కష్టము కలిగించిన క్షంతవ్యులము

5 దేవద్రవ్యము, ప్రజాద్రవ్యము సభకు వినియోగింపబడినది

6 శాస్త్రీయముగా వైరుధ్య పరిష్కార మేమీ జరుగలేదు కావున రాజమహేంద్రవర జ్యోతిశ్శాస్త్ర సభ నిరర్థకము

7. మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారి వాదమే సరియైన దని తోచినపుడు పరిషత్తువారిట్టి అసంపూర్ణతీర్మానము చేయింపక, అధ్యక్షుల చేతను, నిర్ణేతల చేతను, మధురవారి పద్ధతే న్యాయమని, అనుసరణీయమని, నిర్ణయము చేయించి యుండ వలసినది.

8 తా బట్టిన కుందేటికి మూడేకాళ్ళు అనువారికి, న్యాయాన్యాయ విమర్శ లేని వారికి, శాసనప్రయోగం తప్ప మఱియొక గతి లేదు

9 సారాంశము రాజమండ్రి సభా నిర్వాహణము మృగతృష్ణాంభస్స్నానము, గగనకుసుమము, వంధ్యాసంతానము, శశశృంగము - అనువానితో సదృశము.

10. మార్చి 7తేదీ ఆంధ్రప్రభలో మా వ్యాసములోని అన్ని వాక్యములు మేమే వ్రాసితిమో కొన్ని పత్రికవారు వ్రాసిరో పరిషత్తువారు పత్రికాధిపతులకు వ్రాసి కనుగొని యుండవలసినది

విస్తర భీతచే వీలయినంత సంగ్రహముగా పై ఆక్షేపములకు సమాధానము దిగువ ఈయబడుచున్నది ఇందలి ఔచిత్యానౌచిత్యములకు పాఠకులే ప్రమాణము

1 పరిషత్తువారు ఎల్లరకూ సభ జరగునని మొదటి ఆహ్వానముద్వారా తెలిపిరి ఎజండా నిర్ణీతమైన తరువాత అదియు పంపిరి ఎజండా 18 తేదీని తమ కంది నట్లు, వ్యవధి చాలనట్లు, పిడపర్తివారు తెలుపుచున్నారు తా మనుసరించుచున్న పద్ధ యే సర్వసమ్మతము, దానికి తిరుగు లేదని, శాసనప్రయోగం ద్వారానైనా దానినే అమలుజరప దగునని, మిగిలిన ఏ రకమైన కృషియైనా, నిరర్థకమే అని, తెలుపుట కావ్యవధి చాలలే దనుట సమంజసము కాదు సోదరద్వయము పేర వారి పంచాంగము ప్రచురింప బడుచున్నపుడు ఒకరికి పంపి రెండవవారికి ఆహ్వానము పంపకపోవుటలో దురభిప్రాయమును శంకింపవలసిన పనిలేదు తమ్ములకు కూడ వలె ఆహ్వానము పంపు డని అన్నగారు మాకు సూచించినను తప్పులేదు

2 నిరయన పద్ధతినే పంచాంగము చేయదగునను తీర్మానము కేవల మాంధ్రప్రాంతమువారి నుద్దేశించిమాత్రమే చేయ బడలేదు. పరిషత్తువారి ఆహ్వానపత్త్రము సరిగా చదువనైనా చదువక అది యాభాస తీర్మాన మని కొట్టివేయుట సోదర సిద్ధాంతులహృదయనైర్మల్యమునకు సూచకము కాజాలదు ఆహ్వానమందలి ఈ క్రింది వాక్యములు -

'ప్రస్తుతం మన దేశమందు పంచాంగములు భిన్న భిన్న మార్గములలో ప్రచురింపఁబడుచున్నందున ఈ సభకు ఆంధ్ర ఆంధ్రేతర ప్రాంతములనుండి విద్వాంసులు నిర్ణయకర్తలుగా ఆహ్వానింపబడిరి '-ఆ తీర్మానము ఆభాసము కాదని ఋజువు చేయగలవు సంకుచితము గాక ఆ తీర్మానము దేశమంతటి నుద్దేశించిన దని స్పష్టము అది గ్రహింపక ఏదో సామెతను వల్లించుట సిద్ధాంతుల పాండిత్యమున కుత్కర్షావహము కాజాలదు

3. న్యూఢిల్లీలోని భారత జాతీయ విజ్ఞానశాస్త్ర సంస్థవారు 'దేశములో పంచాంగములు భిన్న భిన్న మార్గములలో నున్నవి. పూర్వము రిఫారమ్సు కమిటీ వారు చేసిన పద్ధతులను ఎవరూ అంగీకరింపలేదు ఇప్పుడైనను జాతీయ పంచాంగము నొకదానిని తయారుచేయవలె నను సదుద్దేశముతో శాస్త్రవేత్తలను, పంచాంగకర్తలను సంప్రతించి, వివిధపద్ధతులలో రచించుచున్న పంచాంగములను పరిశోధించి, ఒక జాతీయపంచాంగమును (Standard Calendar) తయారుచేయవలెను' అను వ్యాసమును ప్రచురించిరి అందులోను నిరయనపద్ధతిలోనే పంచాంగమును ప్రచురించవలె నని తీర్మానము పెట్టియున్నారు ఆ వ్యాసము కాపీ యొకటి ఈ సోదర సిద్ధాంతులకును ఆ సంస్థవారు పంపియేయుందురు. అదిచూచినచో రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్తువారి నిరయనపద్ధతి తీర్మాన మాభాసము కాదని, తమ ఆక్షేపము తప్పని సోదర సిద్ధాంతులు గ్రహింపగలరు.

4 సభలో ఏయే అంశములు ఏవిధముగా చర్చింపబడినను సిద్ధాంతరీత్యా ఒక పంచాంగం, దృక్సిద్ధాంత రీత్యా కమిటీ పంచాంగం, రెండూ ఉండాలని తీర్మానము చేయబడలేదు చేయబడని తీర్మానం చేసినట్లుగా భ్రమించి దానిని పురస్కరించుకొని పండితులకు స్వర్ణేతలూ, అధ్యక్షులూ శక్తిలేనివారనీ, దృక్సిద్ధం అంటే తెలియనివారనీ, ఆక్షేపించడం పక్షపాతం అని పించుకుంటుంది తప్ప మరేమీ కాదు. మా తీర్మానము ఇది యని పరిషత్తువారుస్పష్టపఱచిన తర్వాతనైనా తమ పొరపాటునకు విచారము వెలిపుచ్చకపోవడం పండితలక్షణం కాజాలదు

5 వైదిక సత్కర్మాచరణ కుపయోగపడే నిమిత్తం సరియైన కాల నిర్ణయం సాధించేప్రయత్నంలో దైవద్రవ్యం, ప్రజాద్రవ్యం వినియోగించుటలో తప్పేమియో తెలియుటలేదు అదియేదైన అపహృత ద్రవ్యముగా సిద్ధాంతి సోదరులు భావించిరేమో? ఇట్టిసద్వినియోగమునకైనా వారింత బాధపడవలసిన అవసరం కనబడదు

6 వైరుధ్యమే లేదనువారుశాస్త్రీయముగా ఏమీ జరుగలేదనుట, అందుచే సభలు నిరర్థక మనుట విపరీతముగాక మరేమి? నిరయన పద్ధతిని సమర్థించుట, అయనాంశల విషయములో పూర్తి పరిశీలన చేసి నిర్ణయింపవలె ననుట ఈ సభ నిర్ణయములే కదా! ఈ విధముగనే అయనాంశ లుండవలె నని నిర్ణయించుటలో మూర్ఖపు పట్టుదలతో కొందర పాటు చూపకపోవడం మెచ్చదగినదే కానిఆక్షేపార మెటగును? రిపారము।

కమిటీవారినిర్ణయం ఎవరూ అంగీకరింపలేదని భారతీయ విజ్ఞానశాస్త్ర సంస్థవారు ప్రచురించిన వ్యాసం కూడ వేదశాస్త్ర పరిషత్తువారి తీర్మానమును బలపఱచినట్లు గ్రహింపదగును

7. మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారి వాదమే సరియైన దనీ, ఆచరణీయమనీ, వేదశాస్త్ర పరిషన్నిర్వాహకు లెవరూ వాదింపరు ఆంధ్రప్రభలో సిద్ధాంతి సోదరులు ప్రచురించిన వ్యాసములో మధుర వారి పేరు వారి గురువుగారి పేరు ఉటంకించినందున శాస్త్రీయ విషయములకు వారు సహేతుక సమాధానము లీయగలరు

మేము సభానిర్వహణౌచిత్యమును గూర్చిన ఆక్షేపములకు మాత్రమే సమాధానమిచ్చుచుంటిమి అను ఉద్దేశముతో మధురవారి సమాధానమును గూర్చి పేర్కొంటిమిగాని వారియెడల మాకు పక్షపాత మేమియు లేదు ఉద్దండ శాస్త్రపండితులు పరిషత్తువారెలా తీర్మానం చేయుమంటే అలాచేస్తారను కోవడం కాని, అలాపండితులను ఒత్తిడి చేసే అవివేకానికి పరిషత్తువారు పాల్పడు తారను కోవడంకాని వివేకవంత మని పించుకోదు మధురవారు సహేతుక విమర్శావ్యాసములు సమాలోచన పత్రికలో ప్రచురించారు వారి వాదాన్ని ఆమోదించడం కాని, నిందారహితంగా సహేతుకంగా ఖండించడంకాని తజ్జ్ఞులు చేయవలసిన పని

8 కాబట్టిన కందేటికి మాడేకాళ్ళనువారికి న్యాయాన్యాయ విమర్శచేయ నిచ్చగింపనివారికి శాసనప్రయోగం తప్ప గతిలే దని వారు గ్రహించినందుకు ఒక విధంగా సంతసింపవలసి యున్నది అట్టి ప్రయోగమునకు గుతికాకుండ న్యాయాన్యాయ పరిశీలనకు ఇకనైన వారు సమాయత్తులు కాగలరని మా అభిలాష

9 మృగతృష్ణాంభస్స్నానసదృశము, వంధ్యాపుత్త్రి సదృశము, వంటి అనుచిత పదజాలమునకు, ఆదేవిధమైన ప్రతినిందలో సమాధాన మిచ్చే నైచ్యమునకు మేము పాల్పడజాలము.

10 తేదీ 7 3-80 ఆంధ్రప్రభలో 'పంచాంగరచనలో వైరుధ్యాలు' సోదర సిద్ధాంతుల పేర నేయున్నది అందు కొంత భాగం పత్రికాసంపాదకులది అని యెచటను పేర్కొనబడలేదు అదిఅంతా తమ వ్రాత కాక కొంత పత్రికవారిదైతే ఆ తప్పు సవరించుకోవలసిన బాధ్యత తత్పత్రికాధిపతు లది, సవరింప జేయవలసిన బాధ్యత సిద్ధాంతి సోదరులది మాత్రమే యగును

ఇట్లు,

పీసపాటి సూర్యప్రకాశం,

కోశాధికారి, వేదశాస్త్రపరిషత్తు,

రాజమంండ్రి.

# అద్దేపల్లివారి కవితాహాసము - ఋతువిలాసము

- శ్రీ జి. బి ఎస్ ఆచార్య, ఎం ఏ, పి. హెచ్ డి

(గతసంచిక తరువాయి)

'చలిగాలిపోఁకి చన్నులు ప్రీలుటన్ గ్రొత్త
కోడలిమోమూడఁ గొట్టె బత్తె
క్షీరభాండము నట్టిఁ జేర్చిన తియ్యవ్రేళ్లు
చలికిఁ గొంకరవోయి జాఱవిడిచె
చలికిఁ జేసంటినఁ జంగునఁ గాఁపుపై
బడ్డఁగొట్టని గిత్తబుస్సుమనియె
ఏమిరా లెమ్మ పరీక్ష లన్ దల్లిపైఁ
దాడియెత్తిన లేచెఁ దనయుఁడంత
బడికివచ్చిన బుడుతనిఁ బట్టికొట్ట
వీఁపుతోడుగూడి మానమిఁ గోపమూని
తనయునింజూప యొజ్జతోఁ దగలావుడు
జనకుఁగని నవ్వుఁ జలిగాఁడు జగడ
గొండి!'

అని అత్యంత చమత్కారంతో 'చలిగాని' జగడగొండిగా సంభావించి, ఆతని చిత్రవిచిత్రమైన చిలిపిచేష్టలను రసమయంగా వర్ణించారు కవిగారు ఎక్కువగా 'చలి' చేసే వివిధచేష్టలకు ప్రాముఖ్యమిచ్చి, సుదీర్ఘంగా వర్ణించి, తమ వర్ణనాభిలాషను వెల్లడించారు

'ఇలఁజలి మంటలున్, బురద
లింకిన గుంటలు, క్రొత్తపంటలున్,
చలికిఁ దలంకు నాల్మగల
జంటలు, మేలగులియ్యతుంటలున్,
పిలిచిన నివ్వకే పరువు
వెట్టెడు గంటలు, రేఁగేల రో
వెలఁదుల నంటుతుంటలును
వేఁడివి తింటలు సీతుపుంటలన్!'

'బంతులు, వంతులూని కనుఁ
బండువు సేసెడు మంచి మంచిచే
మంతులు, కంతురంతులకు
మంతున కెక్కిన యట్టి యింతులున్
గాంతులు కుక్కుటంబు లాడి
కంబుగఁ జేసెడు నట్టి జంతులున్,
పంతము చెల్లనట్టి శ్రుత
వంతుల తంతులు సీతుకంతులన్!'

ఇత్యాది పద్యాలు అంత్యప్రాసలతో శ్రుతి సుభగత్వాన్ని కలిగిస్తున్నాయి ఈ ఋతువులో పుష్పించే చేమంతులు, సమృద్ధిగా పండే 'చెఱకు' మొదలైన క్రొత్తపంటలు ప్రస్తావింపబడి, ఋతుధర్మాలు చెప్పబడినాయి

'కనిపించు నీరంగు గంగెద్దు పూజలోఁ
బండించు బసవనిపట్ల భక్తి
తెలియనౌ నీగొబ్బి దేవత పూజలో
మనభారతీయ గోమాతృరక్తి
పొడగట్టు నీ పెట్టు బొమ్మలపంక్తిలో
నవ్య సృష్ట్యారాధన ప్రసక్తి
పచరించు నీ భోగి పండ్ల సంబరములో
భవదీయ దేశసౌభాగ్యశక్తి
మొనయు నీ తీరు తీరుల ముగ్గులందు
భారత స్త్రీల శీల సంభావనోక్తి
కానగు నీ యొసంగు భిక్షములలోనఁ
బ్రాచ్య పరమార్థయుక్తి సంక్రాంతి
బాల!'

ఈపద్యం సంక్రాంతి పర్వదిన ఫలశ్రుతిని చెపుతున్నది సంప్రదాయసిద్ధమైన విషయాలను సరసంగా ద్యోతకమొనరించగల కవిగారి ప్రతిభకు ఈపద్యం ప్రతీకయని చెప్పవచ్చు భోగిపండ్ల సంబరంలో దేశసౌభాగ్యశక్తిని సంభావించుకోగల కవి గారి దేశారాధన తత్పరత కొనియాడదగినది భారత స్త్రీకి శీలము ప్రాణము కన్నమిన్న ఈవిషయం గూడా పై పద్యంలో ధ్వన్యమానమైనది గొబ్బి దేవత పూజలో మనభారతీయ గోమాతృరక్తి తెలుస్తున్న దనంలో ఎంతో విశిష్టత వుంది.

'గావః పవిత్ర మంగళ్యా
దేవానామపి దేవతాః
యస్తాః శుశ్రూషతే భక్త్యా
స పాపేభ్యః ప్రముచ్యతే ॥'

(పవిత్రములైన మంగళప్రదములైన గోవులు దేవతలకు సైతము దేవతలవంటివి కావున లక్ష్మీపదమైన గోసేవ సర్వపాపములను అణచును) అని మన వారి విశ్వాసము, మహాభారతాదులందు గోవు పూజ్యమగుటకు గలకారణాలు చెప్పబడినాయి. గోవు విప్రోత్తముని కంటె మొట్టమొదటగా పూజార్హమైనదని, ఈక్రింది సుప్రసిద్ధ మంగళశ్లోకం వల్ల తెలుస్తున్నది

'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు'

అందువల్లనే కవిగారు పైవిధంగా సంభావించారు ఇదికవిగారి సంప్రదాయాభిజ్ఞతను మరింత స్పష్టపరుస్తున్నది

'అల్కగలుగూడి చలిగాని వదిమిపట్టి
ముసుఁగుఁ జెఱసాలవైచి నమ్మదురోలేదొ
నలిబలియొనర్చి సీతు నే జెలియఁ బలికి
వదలివైచిరి బైటఁ జీవాట్లు పెట్టి!'

అని చమత్కారచారుత్వంతో, శృంగారరసస్ఫోరకంగా హేమంతశిశిర ఋతువుల నిష్క్రమణాన్ని ధ్వనింపచేసారు

'పత్రము పుష్పమున్ ఫలము
భక్తిసమర్పణ సేసి దైవమున్
స్తోత్రము చేయుచున్ గడు వి
శుద్ధమతిన్ జరియింతు వీవహో
రాత్రము, శీతవాతముల
లక్ష్యము పేయవు సుంత యేనియున్,
చిత్రము నీచరిత్రము వి
శిష్టము శ్రీ శిశిరా! దయాకరా!

అని శిశిరఋతువును పవిత్రభావాలతో కొనియాడి, 'ఋతుపుంగవ' అనే సంబోధనతో తదృతు ఉదాత్తతను వెల్లడించారు

(సశేషం

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది. వెల రు. 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం. ఒ. చేసిన వారికి పై విధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B V. & Co., Press, Innispet,
(Ty[illegible]raja Na[illegible]r) R[illegible]y-1.